**Milad-un-Nabi**
**(Telugu)**

# మీలాదున్నబి

రచన

**మౌలానా మౌదూది (రహ్మాలై)**

అనువాదం

**యం.డి. ఉస్మాన్ ఖాన్**

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# మీలాదున్నబి

మీలాదున్నబి అంటే ముహమ్మద్ ప్రవక్త (సల్లల్లాహు అలైహి వసల్లం) పుట్టిన రోజని అర్థం. భూమండలంపై శ్వాసపీల్చే మానవులందరి కోసం ఆయన దైవకారుణ్యంగా ప్రభవించారు. ఆయన తెచ్చిన సూత్రాలు ఆచరిస్తే ప్రతి మనిషి, ప్రతి జాతి, ప్రతి దేశం, యావత్తు మానవాళి సమంగా ఇహపర లోకాలలో సుఖశాంతులు పొందగలుగుతుంది. ముహమ్మద్ ప్రవక్త (సఅసం) జన్మదినం ప్రతి ఏడూ వస్తూనే ఉంటుంది. నేటి వాతావరణంలో సమస్త భూవాసులకు ఆయన సంపూర్ణ మార్గదర్శకత్వం చాలా అవసరం. ఆ మహనీయుని మార్గదర్శకత్వం కోసం యావత్ ప్రపంచం ఎదురు చూస్తోంది.

మిస్టర్ జార్జ్ బెర్నార్డ్ షా తెలిసన్నాడో తెలియకన్నాడోగాని "నేటి పరిస్థితుల్లో ముహమ్మద్ ప్రవక్త ఒక నియంతలా పాలిస్తే ప్రపంచంలో సుఖశాంతులు పరిఢవిల్లుతాయ"ని ఒక మంచి మాటన్నాడు. కాని నేను మరో అడుగు ముందుకువేసి, ముహమ్మద్ ప్రవక్త (సఅసం) నేడు మన మధ్య లేకపోయినప్పటికీ, ఆయన ప్రవచించిన సూత్రాలు మాత్రం మన మధ్య సజీవంగా ఉన్నాయి. కనీసం వాటినైనా మనం ఒక నియంత ఆదేశాలుగా స్వీకరించి ఆచరించినట్లయితే నరకప్రాయంగా మారిన నేటి మానవ ప్రపంచం శాంతి, సౌభాగ్యాల నందనవనంలా మారుతుందనడంలో అతిశయోక్తి లేదంటాను.

నేటికి దాదాపు వేయిన్నర సంవత్సరాలకు పూర్వం ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఈ భూమండలంపై పాదంమోపే నాటికి యావత్

ప్రపంచమే కాకుండా, స్వయంగా ఆయన జన్మించిన గడ్డపై కూడా అశాంతి, అలజడులు, దౌర్జన్యం, దురాగతాలు, క్రమశిక్షణా రాహిత్యం రాజ్య మేలుతుండేవి. ఆనాటి పరిస్థితులపై పవిత్ర ఖుర్‌ఆన్ ఇలా వ్యాఖ్యా నించింది: “అగ్నితో నిండిన ఓ గుండం అంచున మీరు నిలబడి ఉన్నప్పుడు, దైవం మిమ్మల్ని రక్షించాడు.” మిగతా దేశాల పరిస్థితులు కూడా దీనికే మాత్రం భిన్నంగాలేవు. ఈరాన్, తూర్పురోమన్ సామ్రాజ్యాలు ఆ కాలంలో మానవ నాగరికతకు కేంద్రబిందువులుగా ఉండేవి. అయితే ఒకవైపు పరస్పరం ఎడతెగని యుద్ధాలు, మరోవైపు అంతర్గత ఆర్థిక వివక్షలు, ఆర్థిక అసమానతలు, మతకలహాలు ఆ రెండు దేశాలను నాశనం చేశాయి. అలాంటి పరిస్థితుల్లో ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ప్రభవించారు. ఆయన మార్గదర్శకత్వంలో ప్రారంభమైన ఉద్యమం కేవలం 23 సంవత్సరాలలో అరేబియా స్థితిగతుల్ని మార్చివేయడమే కాకుండా, ఆ తర్వాత ఈ ఉద్యమం అతికొద్ది కాలంలోనే భారతదేశంతోపాటు ఆఫ్రికావరకు ప్రపంచంలోని ఓ పెద్ద భూభాగాన్ని నైతిక, నాగరిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలతో పాటు మానవజీవితంలోని ప్రతిరంగాన్నీ సమూలంగా సంస్కరించింది.

ఇంతటి మహత్కార్యం, మహోన్నత సంస్కరణ ఏవిధంగా జరిగిందో క్లుప్తంగా తెలుసుకోడానికి ఈ చిరుపుస్తకంలో అవకాశం లేదు కాని, సంక్షిప్తంగానైనా తెలుపడానికి ప్రయత్నిస్తాను.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) అత్యంత ప్రాముఖ్యమిచ్చిన మొట్టమొదటి విషయం యావత్తు మానవాళి సర్వేశ్వరుడైన అల్లాహ్‌ను మాత్రమే ప్రభువుగా, యజమానిగా, విధేయతకు అర్హుడిగా, సర్వాధికారిగా అంగీకరించాలి. ఆయన దాస్యం తప్ప మరెవరి దాస్యాన్నీ స్వీకరించరాదు, అంగీకరించరాదు. కేవలం మతపరమైన పరిమిత పరిధిలోనే కాకుండా, జీవితంలోని సమస్త రంగాల్లో సర్వాధికారి అయిన అల్లాహ్ ముందు తలవంచాలి. ఆయనకే విధేయత చూపాలి.

ఆ మహనీయుని బోధనల్లో మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే, మానవ సార్వభౌమాధికారం, బాధ్యతా రాహిత్యం పూర్తిగా అంతమైపోవాలి. ప్రతి మనిషీ వ్యక్తిగతంగా దైవం ముందు జవాబుదారునిగా భావించాలి. అదేవిధంగా మానవ సంఘాలు, కుటుంబాలు, తెగలు, జాతులు ఏ రూపంలో ఉన్నా అవన్నీ దైవం ముందు సమాధానం చెప్పుకోవాలన్న భావన కలిగి ఉండాలి. మొత్తంమీద మానవుడు ఈ భూమండలంపై దేవుని ప్రతినిధి అన్న భావనను ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ప్రజల మనసుల్లో నాటారు. ఎవరికి ఏరూపంలో ఎలాంటి హోదా, అధికారాలు లభించినా, వాస్తవానికి తమ సొంత అధికారాలు కావు. వారికవి దైవం ప్రసాదించినవి. కాబట్టి వీటి విషయంలో వారు దైవానికి సమాధానం చెప్పుకోవలసి ఉంటుంది.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) దైవ సార్వభౌమాధికారానికి మానవుడ్ని ప్రతినిధిగా చేసి మానవుల మధ్య సమతా, సమైక్యతల మార్గం సుగమం చేశారు. మానవ సమానత్వం, మానవ ఏకత్వాలకు ఇంతకు మించి మరే మార్గమూ ఆచరణయోగ్యం కాజాలదు. కులం, మతం, వర్ణం, భాష, జాతి, ప్రాంతం- ఇంకా ఇలాంటి అనేక విషయాల ఆధారంగా ఏర్పడే మానవ సమాజం తప్పకుండా మానవుల్ని విభిన్న వర్గాలుగా విభజిస్తుంది. ఈ వర్గాల మధ్య ఎప్పుడైనా కాస్తంత సారూప్యత కనిపించినా అది స్వప్రయోజనాల ఆధారంగా ఏర్పడే మన్నికలేని తాత్కాలిక సారూప్యత మాత్రమే. పరస్పర సంఘర్షణ, యుద్ధాలు ఆ విభజనకు నైజమవుతుంది. దాని పర్యవసానం అన్యాయం, అక్రమాల రూపంలో బహిర్గతమవుతుంది. ఈ సమస్యకు ఒకేఒక పరిష్కార మార్గం ఉంది. మానవులందరినీ దైవదాస్యం ఆధారంగా ఏకం చేసి, మరణానంతరం దైవం ముందు సమాధానం చెప్పుకోవాలనే జవాబుదారీ భావనను సృజించడం ద్వారా వారిని న్యాయం కోసం ఒప్పించాలి.

ముహమ్మద్ ప్రవక్త (సఅసం) జాతి, వర్గతత్వాలకు బదులుగా దైవదాస్యం, దైవప్రాతినిధ్య భావనల ఆధారంగా విశ్వవ్యాప్త సాంఘిక జీవన వ్యవస్థను నెలకొల్పి, దాని ప్రతి అంగమూ, ప్రతి కోణమూ నైతిక సూత్రాలకు లోబడి ఉండేలా తీర్చిదిద్దారు. ఈ నైతిక సూత్రాలు ప్రపంచాన్ని పరిత్యజించిన సన్యాసుల కోసం ప్రతిపాదించబడినవు కావు. కార్మికులు, కర్షకులు, వర్తకులు, రాజులు, భూస్వాములు, కూలీలు, పోలీసులు, న్యాయమూర్తులు, కలెక్టర్లు, గవర్నర్లు, రాష్ట్రపతులు, సైనికులు, సైన్యాధికారులు, మంత్రులు, రాయబారులు, అధికారులు, అనధికారులు, మాన్యులు, సామాన్యులు- అందరి కోసం ఈ నైతిక నిబంధనావళి రూపొందించబడింది. అందరూ ఈ నైతిక బంధనాల్లో బందీలుగా ఉండాలి. వాటిని త్రెంచడం గాని, మార్పులు చేర్పులు చేయడానికిగాని ఎవరికీ ఎలాంటి అధికారం లేదు.

అంతేకాదు, మహాప్రవక్త (సఅసం) మానవుని వ్యక్తిగత-సామాజిక సంబంధాలను, సాహిత్యం-లలిత కళలను, వ్యాపార లావాదేవీలను, పరిపాలనా వ్యవస్థను, జాతీయ, అంతర్జాతీయ విషయాలను, విదేశాంగ నీతి, యుద్ధం, ఒడంబడికలను, ఒక్కమాటలో చెప్పాలంటే మానవజీవితంలోని సకలరంగాలను నీతి నిజాయితీలకు లోబడేలా తయారుచేశారు. నైతిక సూత్రాలకు తిలోదకాలిచ్చి, అనైతికతకు తావిచ్చే ఎలాంటి మానవ ప్రగతినైనా ఆయన నిర్ద్వంద్వంగా తిరస్కరించారు.

ఇది స్థూలంగా ముహమ్మద్ ప్రవక్త (సఅసం) చేపట్టిన సంస్కరణా కార్యక్రమం. ఈ కార్యక్రమాన్ని అమలు పరచడానికి ఆయన ఏవిధానాన్నయితే ఎంచుకున్నారో అది వ్యక్తిగత సంస్కరణతో ప్రారంభమవుతుంది. సామూహిక సంస్కరణకు అసలు పునాది వ్యక్తిగత సంస్కరణే. చేసేది ఎంత మంచిపని అయినా, ఎలాంటి సత్కార్యమైనా, శీలరహితులతో, నమ్మకంలేని మనుషులతో వాటిని విజయవంతంగా సాధించడం దాదాపు అసాధ్యం. శీలంలేని వ్యక్తుల ద్వారా ఒక వ్యవస్థను నిర్మించే క్రమంలో ఏర్పడే

లొసుగులను కాగితాల ద్వారా పూరించలేము. కాగితాల ప్రపంచం లోనైతే, అవే కాగితాల ద్వారా ఆ లొసుగులను, అవరోధాలను నివారించే ప్రయత్నం చేయవచ్చు. కాని ఆచరణాత్మకంగా ఈ కాగితపు పటాన్ని (మ్యాప్‌ను) నడిపించాలంటే, ఆ నడిపించేవారు స్వార్థపరులు, స్వలాభా పేక్షకులు, మనోవాంఛల దాసులు, నిలకడలేని వ్యక్తులు అయితే వారిలో న్యాయ శీలత, సత్యసంధత, నైతికత, శీల నిర్మాణం లేకపోయినట్లయితే వారు ఎంతటి గొప్ప వ్యూహాన్ని రచించుకున్నా ఎన్ని జాగ్రత్తలు పాటించినా ఆ వ్యవస్థలో తప్పకుండా అవరోధాలు తలెత్తుతాయి. కనీసం వారు ఊహించని మార్గాల్లో సైతం తలనొప్పులు మొదలవుతాయి.

దీనికి భిన్నంగా కాగితంపైని వ్యవస్థను పరిశీలించి ఇందులో ఎక్క డెక్కడ అవరోధాలు ఎదురుకానున్నాయనే విషయాన్ని మీరు గమనించ గలరు. అయితే ఈ వ్యవస్థను అమలుపరచడానికి, నడపడానికి నమ్మ కస్తులు, సచ్ఛీలురైన వ్యక్తులు ఉన్నట్లయితే ఆచరణాపథంలో ఎన్ని అవరోధాలు ఎదురైనా వాటిని సునాయాసంగా అధిగమించగలుగుతారు.

ఈ కారణంగానే ముహమ్మద్ ప్రవక్త (సఅసం) మొట్టమొదట ఇలాంటి వ్యక్తులను తయారుచేయడంలోనే తన శక్తినంతా ధారపోశారు. వీరంతా ఆయన రూపొందించిన కార్యక్రమం ప్రకారం సమాజ సంస్కరణకు కృషిచేస్తారు. ఆయన తయారుచేసిన వ్యక్తులు ఎట్టిపరిస్థితులు ఎదురైనా ఒక్క దేవునికి మాత్రమే భయపడుతూ అన్నిరకాల చెడులకూ దూరంగా ఉండేవారు. తమ జీవితంలోని అన్నిరంగాల్లో దైవానికి సమాధానం చెప్పు కోవాలనే జవాబుదారీభావనతో జీవితం గడిపేవారు. దైవానికి అయిష్ట మనుకునే ప్రతి పనికీ వారు దూరంగా ఉండేవారు. దైవప్రన్నతకు సంబం ధించిన ప్రతి విషయంలో వారు తమ ధన ప్రాణాలనైనా పణంగా పెట్టడానికి ప్రయత్నించేవారు. దైవప్రసన్నత కోసం ఎలాంటి త్యాగాలకైనా అనుక్షణం సిద్ధంగా ఉండేవారు.

వారి మనసులో దైవభయం తప్ప మరే భయమూ ఉండేదికాదు. ఎవరి దయాదాక్షిణ్యాల కోసం కూడా వారు లాలూచీ పడేవారుకాదు. వారు తమ వ్యక్తిగత, సామూహిక, కౌటుంబిక, సామాజిక జీవితాలలో నీతి, న్యాయాలనే ఊపిరిగా చేసుకొని జీవితం గడిపేవారు. ప్రజాజీవితంలో నలుగురి ముందు ఎంత నిరాడంబరులుగా, పరిశుద్ధలుగా, సచ్ఛీలురుగా ఉండేవారో, ఏకాంత జీవితంలోనూ అంతే నిరాడంబరులుగా, పరి శుద్ధలుగా, సచ్ఛీలురుగా ఉండేవారు. ఒకవేళ ప్రజల ధన, శీల, ప్రాణాలను రక్షించే బాధ్యత అప్పగించబడితే ఆ బాధ్యతను వారు ఒక అమానతుగా భావించి నూరు శాతం న్యాయం చేయగలరనే నమ్మకం ఉండేది. దేశం కోసం, జాతి కోసం, ప్రజల కోసం వారు ఏదైనా ప్రతిన బూనితే దానికి వారు తప్పకుండా కట్టుబడి ఉంటారు. అధికారపీఠం అప్పగించినట్లయితే వారెన్నడూ అధికార దుర్వినియోగానికి పాల్పడరు. వ్యాపార లావాదేవీలు జరిపితే నిజాయితీపరులుగా ప్రశంసించబడతారు. తమ హక్కులు రాబట్టుకోవడంలో కాస్త వెనుకబడ్డా, ఇతరుల హక్కులు నెరవేర్చడంలో మాత్రం వారు అందరికంటే ముందుంటారు. తమ మేధ, జ్ఞానం, తెలివి తేటలు, ఇతర ఒనరులను న్యాయం కోసం, జనసంక్షేమం కోసం ధార పోస్తారు తప్ప వ్యక్తిగత స్వలాభాల కోసం ఏమాత్రం వాటిని వినియోగించరు.

ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఇలాంటి వ్యక్తుల నిర్మాణం కోసం మొత్తం పదిహేను సంవత్సరాలు కష్టపడి కొద్దిమంది సత్యప్రేమికుల్ని తయారుచేశారు. ఈ సత్యకాముకుల్ని సంఘటిత పరచిన తరువాత ఆయన భారీ ఎత్తు సమాజసంస్కరణ కోసం క్రియాత్మక కృషి చేశారు. తద్వారా ఆయన కేవలం ఎనిమిదేండ్లలో పదిహేను లక్షల చదరపు మైళ్ళ అరేబియా భూభాగంలో సంపూర్ణ నైతిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విప్లవం లేవదీశారు. ఆ మహనీయుడు సంఘటిత పరచిన సత్యప్రేమికులే అరబ్ సమాజ సంస్కరణ కార్యం ముగిసిన తరువాత ముందుకు పురోగమిస్తూ

ఆనాటి నాగరిక ప్రపంచంలోని అత్యధిక భాగాన్ని అరేబియాలో లేచిన ఈ విప్లవ శుభాలలో ముంచెత్తారు.

ఈనాడు నూతన వ్యవస్థ (New Order)కు సంబంధించిన నినాదాలు నలువైపుల నుండి మిన్ను ముట్టుతున్నాయి. కాని పాత వ్యవస్థను ఛిన్నాభిన్నం చేసిన మౌలిక రుగ్మతలే మరో రూపంలో నూతన వ్యవస్థలో కూడా చోటుచేసుకుంటే, అది నూతన వ్యవస్థ ఎలా అవుతుందో మాకర్థం కావడం లేదు. ఇది (కొత్త సీసాలో పాత సారాలా) పాత వ్యవస్థగానే ఉంటుంది.

దైవభీతి-ధర్మపరాయణతలు లేని మానవతా విలువలు, జాతి వివక్షలు, జాతుల రాజకీయ-ఆర్థిక స్వార్థపరత్వం, నాస్తిక భావాలు గల వ్యక్తులు అధికారంలోకి రావడం మొదలైన మౌలిక రుగ్మతలే ఈనాటి వరకు మానవజాతిని సర్వనాశనం చేస్తున్నాయి. మన జీవనవ్యవస్థ ఈ రుగ్మతలకే గురయివుంటే ఇకముందు కూడా ఇవి మనల్ని నాశనం చేస్తూనే ఉంటాయి. సంస్కరణ సాధ్యం కావాలంటే, పధ్నాలుగు శతాబ్దాల క్రితం మానవ శ్రేయోభిలాషి అయిన ముహమ్మద్ ప్రవక్త (సఅసం) మనకు ఏ సూత్రాల వైపు మార్గదర్శనం చేసి ఆచరణాత్మకంగా సమాజాన్ని సంస్కరించి చూపారో ఆ సూత్రాలను అవలంబించడం వల్లనే సాధ్యమవుతుంది.

ముహమ్మద్ ప్రవక్త (సఅసం) జన్మదినం ప్రపంచానికొక శుభదినం. ఆయన యావత్ ప్రపంచానికి మార్గదర్శిగా ప్రభవించిన రోజిది. ఇస్లామీయ ధర్మశాస్త్రం ముహమ్మద్‌ప్రవక్త (సఅసం) జన్మదినాన్ని పర్వదినంగా నిర్ణయించనప్పటికీ, ఒక సంప్రదాయంగా నిర్దేశించనప్పటికీ ఎవరైనా ఆయన (సఅసం) గొప్ప దైవప్రవక్తని, సమస్త మానవజాతికి సన్మార్గం చూపడానికి వచ్చిన గొప్ప ప్రబోధకుడని, ఆయన మానవాళికి దైవం ప్రసాదించిన అమూల్యవరమని భావించి ఎవరైనా ఆయన జన్మదినాన్ని పర్వదినంగా పరిగణిస్తే అందులో అభ్యంతరం కూడా లేదు. అయితే ప్రవక్త జన్మదినం

పేరుతో మస్తుగా తినడం, తాగడం, దీపాలు వెలిగించడం, జెండాలు తీయడం, అనవసరపు అలంకరణలు చేయడం, దుబారా ఖర్చు- ఇవన్నీ దురాచారాలు. ఇలా చేయడంవల్ల మనకు, అజ్ఞానులకు తేడా లేకుండా పోతుంది. అజ్ఞానజాతుల ప్రజలు తమ చరిత్రలోని గొప్పగొప్ప సంఘటనలను, తమ పెద్దల జన్మదినాలను మేళతాళాలతో, ఊరేగింపులతో జరుపుకుంటారు. ఒకవేళ మనం కూడా వారి విధానాలనే అనుకరిస్తే మనం కూడా వారిలాగానే అజ్ఞానులుగా మారిపోతాము.

ఇస్లాం జ్ఞాపికను జరుపుకోవడానికి ఓ కొత్త పద్ధతి చూపింది. అన్నిటి కంటే గొప్పజ్ఞాపిక హజ్రత్ ఇబ్రాహీం (అలై) చేసిన త్యాగమే. ఆయన త్యాగ నిరతిని స్మరించుకోడానికి దేవుడు ఈదుల్‌అజ్‌హా నమాజ్, పశుబలి (ఖుర్బానీ), హజ్, తవాఫ్‌ల విధానం నిర్ణయించాడు. ఈ విధానం గురించి ఆలోచించినట్లయితే, ముస్లింలు తమ చరిత్రలోని గొప్ప సంఘటనలను ఎలా స్మరించుకోవాలన్న విషయం మనకు బోధపడుతుంది. రబీవుల్ అవ్వల్ పన్నెండవ తేదీ మనకు ఏవిధంగా ముఖ్యమైన రోజో మనం ఆలోచించాలి. ఆరోజు ఒక అరేబియా వాసుని ఇంట ఒక పిల్లవాడు పుట్టాడనే దృక్కోణంతో కాదు. ఆ రోజు దేవుడు ఓ గొప్ప ప్రవక్తను భూమండలం పైకి పంపాడనే దృక్కోణంతో ఆలోచించాలి. ఆయన ద్వారా యావత్ మానవాళికి దైవజ్ఞానం లభించింది. ఆయన వల్లనే మనిషి మానవుడుగా రూపొందాడు. ఆయన యావత్ జగత్తుకు దైవకారుణ్యంగా ఆవిర్భవించారు.

ఆయన ద్వారానే భూమండలంపై విశ్వాసం, సదాచరణల కాంతి ప్రసరించింది. మరి ఈ చారిత్రక నేపథ్యం, దాని ప్రాముఖ్యం ఇంత ఉన్నతంగా ఉన్నప్పుడు దాని సంస్మరణా విధానం కూడా అంతే ఉన్నతంగా ఉండాలిగదా! అందువల్ల ముహమ్మద్ ప్రవక్త (సఅసం) జన్మదినం సందర్భంగా ఆయన బోధనలను విస్తృతంగా ప్రచారం చేయాలి. ఆయన (సఅసం) నీతి నడవడికలు, హితోపదేశాల నుండి గుణపాఠం నేర్చుకోవాలి. ఏడాది పొడవునా గుర్తుండిపోయేలా ఆయన బోధనలను గురించి

చర్చించాలి. ప్రజల్లో చర్చకు పెట్టాలి. ఈవిధంగా ముహమ్మద్ ప్రవక్త (సఅసం) జన్మదినం జరుపుకుంటేనే మనం నిజానికి 'మీలాదున్నబి'ని పర్వదినంగా భావిస్తున్నట్లు అనుకోవచ్చు. అలాకాకుండా కేవలం తిని తాగి, ప్రవక్త బోధనలు విస్మరించి ప్రవర్తిస్తే ఇది ముస్లిముల పర్వదినం అన్పించు కోవడానికి బదులు అజ్ఞానుల పర్వదినం అన్పించుకుంటుంది.

దేవుడు తన అంతిమ గ్రంథం ఖుర్‌ఆన్‌లో **"మేము ఒక ప్రవక్తను పంపాము మీరు అతనికి విధేయత చూపాలి"** అని సెలవిస్తున్నాడు. ఈ కారణంగా కూడా దైవప్రవక్తకు విధేయత చూపడం ముస్లింలకు తప్పనిసరి. ఈ సాధారణ ఆజ్ఞే కాకుండా దేవుడు ప్రత్యేకంగా ముస్లింల కోసం కొన్ని ఆదేశాలు జారీచేశాడు. అవి కూడా మీ ముందుంచడానికి ప్రయత్నిస్తాను.

**"ప్రవక్తా! ప్రజలతో చెప్పండి. మీరు దైవాన్ని ప్రేమిస్తున్నట్లయితే నాకు విధేయత చూపండి, దైవం మిమ్మల్ని ప్రేమిస్తాడు."**

"విశ్వాసుల పని ఇది. దైవం, దైవప్రవక్త వైపుకు వారిని పిలిచినప్పుడు, దైవప్రవక్త వారి మధ్య తీర్పు చెప్పినప్పుడు, వారు 'మేము విన్నాము, విధేయత స్వీకరించాము' అంటారు. విశ్వసించిన పురుషులు, విశ్వసించిన స్త్రీల పని ఇదికాదు: దైవం, దైవప్రవక్త వారి మధ్య ఒక నిర్ణయం చేసివేస్తే, వారు దాన్ని తోసిరాజని స్వయంగా తామే ఆ విషయంలో మరో నిర్ణయం తీసుకున్నట్లయితే వారు దైవం, దైవప్రవక్తకు అవిధేయత చూపి, మార్గభ్రష్టత్వంలో బహుదూరం వెళ్ళిపోయారు."

**"తమ పరస్పర వివాదాల్లో దైవప్రవక్తను న్యాయనిర్ణేతగా స్వీకరించ నంతవరకు, ఆయన ఏ నిర్ణయం చేసినా దాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించ నంతవరకు, యథావిధిగా ఆ ఆదేశాల ముందు తలవంచనంత వరకూ ఎవరూ ఎట్టి పరిస్థితిలోనూ విశ్వాసులు కాజాలరు."**

"ఎవరైతే దైవప్రవక్తను వ్యతిరేకించేవారు తామెక్కడ ఉపద్రవంలో పడిపోతామోనని భయపడాలి. దైవప్రవక్తను బాధపెట్టడం మీ విధానం కాకూడదు."

"ఎవరైతే దేవునికి, దైవప్రవక్తకు బాధకలిగిస్తారో, వారిని దేవుడు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ తప్పకుండా శపిస్తాడు."

"దైవప్రవక్త వాక్కును మీరు పరస్పరం మాట్లాడుకునే సాధారణమైన మాటగా భావించకండి."

"విశ్వసించిన ప్రజలారా! దైవప్రవక్త గొంతుతో సమానంగా గొంతు పెంచి మాట్లాడకండి. మీరు పరస్పరం మాట్లాడుకుంటున్నట్లు దైవప్రవక్తతో కరకుగా మాట్లాడకండి. దీనివల్ల మీ సదాచరణలు వృథా అయి, మీకు శుభం కలిగే అవకాశాలు మూసుకుపోయే ప్రమాదముంది."

"ఒకవైపు దైవాన్ని, అంతిమ దినాన్ని విశ్వసిస్తూ, మరోవైపు దైవానికి, దైవప్రవక్తకు శత్రువులైనవారితో స్నేహం చేస్తున్న వారిని మీరెక్కడా చూడలేరు. వారు తండ్రి అయినా, కొడుకైనా, సోదరుడైనా, ఇతర బంధువు లెవరైనా సరే."

"ప్రవక్తా! ప్రజలతో ఇలా చెప్పు: మీ తండ్రి, కొడుకులు, సోదరులు, భార్యలు, బంధువులు, మీరు సంపాదించిన ధనసంపద, మీరు నష్టపోతా యేమోనని భయపడుతున్న మీ వ్యాపారాలు మీకు జిహాద్ కంటే ప్రియమైన వైతే, దైవం తన నిర్ణయాన్ని ప్రకటించే రోజుకోసం నిరీక్షించండి."

ఈ విషయానికి సంబంధించిన ఖుర్ఆన్ వాక్యాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. వాటన్నిటినీ ఇక్కడ పేర్కొనడం కష్టం. ఇంతకూ నేను చెప్ప దలచుకున్నదేమిటంటే, ముస్లింలుగా మనకు, దైవప్రవక్త (సఅసం)కు మధ్య ఉన్నటువంటి సంబంధాన్ని మనం గుర్తించాలన్నదే. పైన పేర్కొన్న కొన్ని ఖుర్ఆన్ సూక్తుల ద్వారా ఈ విషయం తేటతెల్లమై పోయింది. దైవప్రవక్త మార్గదర్శకత్వాన్ని పూర్తిగా స్వీకరించనంతవరకూ ఏ మనిషీ ముస్లిం కాలేడన్న వాస్తవం ఈ సూక్తుల ద్వారా మనకు స్పష్టంగా అర్థమైపోయింది. ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఒక ఆదేశమిచ్చినప్పుడు ఒక వ్యక్తి నేను దాన్ని ఒప్పుకోను అని అంటే అతని హృదయంలో రవ్వంత విశ్వాసం కూడా లేదని అర్థం. ప్రవక్త ఆదేశం ముందుకు రాగానే మారు మాట్లాడకుండా దాన్ని శిరసావహించడమే ఈమాన్ (విశ్వాసం). అనుమానం, ఊగిసలాటలతో చేసే

ఆలోచనకు, ఈమాన్‌కు మధ్య పొంతన కుదరదు. ప్రవక్త ఆదేశం వినగానే మరో ఆలోచనకు తావీయకుండా దానిముందు తలవంచేయాలి. ఈమాన్ కోరేది అదే.

ఇక ఇప్పుడు దైవప్రవక్త (స) దేవుని తరఫున మనకు ఏమి ఆదేశాలిస్తున్నారో గమనిస్తూ, వాటి వెలుగులో మన విశ్వాసాలను బేరీజు వేయడానికి ప్రయత్నిద్దాం. ప్రవక్త మహనీయులు ఇలా సెలవిచ్చారు:

"ఎవరి నోటి ద్వారా, ఎవరి చేతుల ద్వారా ప్రజలు సురక్షితంగా ఉంటారో వారే ముస్లింలు." అంటే చేతితోగాని, నోటితోగాని ప్రజలను కష్టపెట్టకూడదని అర్థం.

దైవప్రవక్త (సఅసం) మరో సందర్భంలో ఇలా సెలవిచ్చారు:

"మీరు మీ కొరకు ఇష్టపడినదాన్నే మీ సోదరుని కోసం కూడా ఇష్టపడనంతవరకు మీరు పరిపూర్ణ విశ్వాసులు కాలేరు. ఏవిధంగా మీరు మీ సుఖసంతోషాలు కోరుకుంటారో, అదేవిధంగా మీ సోదరుల సుఖ సంతోషాలను కోరుకోవాలి. ఏ విధంగా మీరు మిమ్మల్ని మీరు కష్టనష్టాల నుండి కాపాడుకుంటారో, అదేవిధంగా మీ సాటి సోదరులు కూడా కష్ట నష్టాల నుండి సురక్షితంగా ఉండాలని కోరుకోండి."

హజ్రత్ అబూజర్ గిఫారి(రజి) ఇలా అంటున్నారు: "ఒకసారి ఒక మనిషితో నాకు గొడవ వచ్చింది. ఆవేశంలో నా నోట పొరపాటున 'నీయమ్మ' అనే పదం దొర్లిపోయింది. ఈమాట విన్న ప్రవక్త మహనీయులు (స) 'నీలో ఇంకా ఇస్లాం పూర్తిగా ప్రవేశించలేదన్నమాట. అజ్ఞాన ప్రభావం ఇంకా నీలో మిగిలేఉంది' అన్నారు."

ప్రవక్త మహనీయుల (స) మరో ప్రవచనం చూడండి: "నాలుగు దుర్గుణాల ద్వారా మునాఫిక్‌ను గుర్తించవచ్చు. ఎవరిలో ఈ నాలుగు దుర్గుణాలు ఉంటాయో అతడు పూర్తి మునాఫిక్ (కపటి). మరెవరిలో రెండు దుర్గుణాలుంటే అతడు అర్ధ మునాఫిక్. అలాగే ఒక దుర్గుణం మాత్రమే కలవాడు పావు మునాఫిక్ అవుతాడు. అంటే ఎవరిలో ఏ మేరకు ఆ దుర్గుణాలుంటాయో ఆ మేరకు అతడు కపటి అన్నమాట. ఆ దుర్గుణాలు ఇవి: 1. నమ్మి ఏదైనా అమానతు అతడి వద్ద ఉంచితే దాన్ని, లేక అందులో

కొంత కాజేయడం. 2. అతడేదైనా మాట్లాడితే అందులో తప్పకుండా అబద్ధం ఉంటుంది. 3. ఏదైనా వాగ్దానం చేస్తే దాన్ని భంగపరచడం. 4. ఎవరితోనైనా వివాదం తలెత్తితే బూతులు తిట్టడం, ప్రత్యర్థిని అన్యాయంగా నైనా సరే అవమానపరచడం."

మరోసూక్తిలో ఆయన (సఅసం) ఇలా అన్నారు:

"ఒక విశ్వాసి మరో విశ్వాసికి సోదరుడు లాంటివాడు. అతడు అతనిపై దౌర్జన్యానికి దిగడు, మరో దౌర్జన్యపరుడికీ అతణ్ణి అప్పగించడు. ఎవరైతే తన సోదరుని అవసరాలు తీర్చడంలో నిమగ్నమవుతాడో, దేవుడు అతడి అవసరాలు తీర్చడంలో నిమగ్నుడవుతాడు. ఎవరైనా ఒక వ్యక్తి తన సోదరుడ్ని ఒక కష్టం నుండి కాపాడితే, దేవుడు అతణ్ణి ప్రళయ దినాన ఎదురయ్యే కష్టాల నుండి ఒక కష్టం దూరం చేస్తాడు. ఎవరైతే తన సోదరుని తప్పుల్ని దాస్తాడో, ప్రళయదినాన దేవుడు అతడి తప్పులను దాస్తాడు."

ప్రవక్త మహనీయులు (సఅసం) ఇలా సెలవిచ్చారు:

"మీ సోదరునికి సహాయపడండి. అతడు పీడితుడైనా, దౌర్జన్య పరుడైనా సరే...' ప్రవక్త అనుచరులు ఈమాట విని "దైవప్రవక్తా! మేము పీడితుడికైతే సహాయపడగలం, కాని దౌర్జన్యపరుడికెలా సహాయపడాలి?" అన్ని ఆశ్చర్యంగా అడిగారు. దానికి దైవప్రవక్త (స) "అప్పుడు మీ సోదరుణ్ణి దౌర్జన్యం చేయకుండా అతడి చేయిపట్టి ఆపడమే అతడికి సహాయ పడడమంటే" అని సెలవిచ్చారు.

మరో సందర్భంలో ముహమ్మద్ ప్రవక్త (స) ఇలా బోధించారు:

"పీడితుని శాపానికి భయపడండి. ఎందుకంటే పీడితుని శాపానికి, దేవునికి మధ్య ఎలాంటి పరదా ఉండదు. అంటే అది నేరుగా దైవసింహాసనానికి చేరుతుంది."

మరో సూక్తిలో ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు:

'ఎవరైనా తన సోదరుని హక్కులను భంగపరచినట్లయితే, అతని మనసు బాధపెట్టినట్లయితే- అంటే అతని సొమ్ము కాజేసినా, అతని పరువు

మర్యాదలపై దాడి చేసినా లేక మరేవిధంగానైనా అతడ్ని బాధ పెట్టడం జరిగితే ఆ వ్యక్తి ఇహలోకంలోనే అతనికి క్షమాపణ చెప్పుకోవాలి. ఇహలోక జీవితంలో క్షమాపణ చెప్పుకోకపోతే, పరలోకంలో ఈ తప్పులను మాఫీ చేయించుకోడానికి ఇక్కడి డబ్బు, దస్కం ఏమ్రాతం పనికిరావు. అక్కడ సదాచరణలు మాత్రమే పనికొస్తాయి. దౌర్జన్యం చేసినవాడి సత్కార్యాలన్నీ పీడితుని ఖాతాలో వేసి, పీడితుని పాపాలన్నీ అతడి హక్కులను కొల్లగొట్టిన దౌర్జన్యపరుడి నెత్తిన రుద్దబడతాయి.'

మరో సూక్తిలో: 'పక్కవాడి జానెడు భూమినైనా సరే అన్యాయంగా ఆక్రమించుకుంటే, ప్రళయంనాడు అతని మెడలో ఏడు భూములంత బరువైన కంఠహారం వేయబడుతుంద''ని ఆయన ప్రవచించారు.

మహాప్రవక్త (సఅసం) వేరొక సందర్భంలో ఇలా తెలిపారు:

"'ఏకేశ్వరుడైన దేవునికి ఇతరుల్ని సాటి కల్పించడం, తల్లిదండ్రు లకు అవిధేయత చూపడం, వారి హక్కుల్ని గుర్తించకపోవడం, అబద్ధా లాడడం, అబద్ధపు సాక్ష్యం పలకడం ఈ మూడు మహాపాపాలు. జిబ్రీల్ అలైహిస్సలాం పొరుగువారిపట్ల సత్ప్రవర్తనతో మెలగాలని ఎంతగట్టిగా చెప్పారంటే, దానివల్ల పొరుగువారిని వారసత్వపు ఆస్తిలో వాటాదారులుగా చేస్తారా అన్న అనుమానం కూడా కలిగింది నాకు."

"మీ దురాగతాలకు మీ పొరుగువారు భయపడుతున్నట్లయితే మీలో విశ్వాసం లేదన్న మాట" అని దైవప్రవక్త (సఅసం) ప్రవచించారు.

"ఎవరిలో విశ్వాసముందో వారు పొరుగువారిని బాధించకూడదు, అతిథి పట్ల మర్యాదగా, గౌరవంగా వ్యవహరించాలి, మాట్లాడితే సత్యమే పలకాలి, లేకపోతే మౌనంగా ఉండాలి."

దైవప్రవక్త (సఅసం) సెలవిచ్చారు: "ప్రళయదినాన దేవుని సమక్షంలో రెండు నాలుకల మనిషి అత్యంత నీచుడవుతాడు. రెండు నాలుకల మనిషి అంటే- ఒకరివద్ద ఒక మాట, మరొకరి వద్ద మరోమాట, మనిషి ముందొక మాట, వీపు వెనుక ఒకమాట పలికేవాడన్న మాట."

దైవప్రవక్త (స) ఇలా సెలవిచ్చారు: "మనిషికి, సత్యతిరస్కారానికి మధ్య భేదం నమాజు వదలడమే ఉంది. అంటే విశ్వాసానికి, అవిశ్వాసానికి మధ్య నమాజు వదలడమనే ఒక దశ ఉంది. మీరుగనక నమాజును వదిలేస్తే కుఫ్ర్, ఇస్లాంల మధ్యలో వేలాడుతున్నట్లు, ఒక్క అడుగు అవతలికి వేస్తే కుఫ్ర్ సరిహద్దుల్లోకి ప్రవేశిస్తారు."

ఒక సందర్భంలో ముహమ్మద్ ప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారు: "ఎవరైతే అజాన్ పిలుపు విని ఇళ్ళల్లోంచి కదలరో, అలాంటి వారి ఇళ్ళను తగలబెట్టాలనిపిస్తోంది నాకు."

నమాజు గురించిన అప్రమత్తత, ఏమరుపాటుల విషయంలో అనేక హదీసులు ఉన్నాయి. కాని నేనిక్కడ రెండు హదీసుల్ని మాత్రమే పేర్కొన్నాను. నమాజు గురించిన ఆదేశం ఎంత ముఖ్యమైనదో దీన్నిబట్టి అర్థం చేసుకోగలం. ఈనాడు ముస్లింలు సాధారణంగా ఏమరుపాటుకు గురైవున్న ఒక 'విధి'కి సంబంధించిన ఆదేశమిది. ముస్లింలను సర్వనాశనం చేస్తున్న మరో మహాపాపం వడ్డీ. ఈ విషయంలో కూడా దైవప్రవక్త ఆదేశాలు చాలా స్పష్టంగా ఉన్నాయి. 'వడ్డీ ఇవ్వడం, తీసుకోవడం, వడ్డీకి సంబంధించి దస్తావేజులు రాయడం, ఈ వ్యవహారాల్లో సాక్షులుగా ఉండడం నిషిద్ధం (హరామ్). వీటిలో ఏ ఒక్కటి చేసినా దానికి శిక్ష నరకమే.'

మిత్రులారా! మీరు మీలాదున్నబి జరుపుకోవడం చాలా సంతోషమే. కాని నా విన్నపం ఏమిటంటే, మనం రేపు ప్రవక్త మహనీయు(సఅసం)ని సన్నిధిలో హాజరయ్యేందుకు ఏ ముఖంతో వెళ్ళగలం? తప్పు చేసిన నౌకరు తన యజమాని ముందుకు పోవడానికి ముఖం చెల్లక తప్పించుకొని తిరుగుతాడు. మరి మనం ప్రతిరోజూ ప్రవక్త మహనీయుని (స) ఆదేశాలను ఎన్నిటిని తుంగలో తొక్కడం లేదు? ఎన్ని హితోపదేశాల్ని పెడచెవిన పెట్టి ఇష్టానుసారం వ్యవహరించడం లేదు? దేవా! మమ్మల్నందర్నీ దైవప్రవక్త (సఅసం) ఆదేశాల ప్రకారం పూర్తిగా ఆయన అడుగుజాడల్లో నడిచే భాగ్యం ప్రసాదించు.

